విమల మై శ్రేష్ఠమై వెలయు తారకము
వినవమ్మ యిది రెండువిధములై యుండు
నొనర పూర్వాపర యోగంబు లనఁగ
నమర నచ్చట పూర్వమగు తారకంబు
క్రమముగ రాజయోగం బపరంబు
గరిమమై పూర్వయోగము తొల్త వినుము
దిరముగ నెల్ల మూర్తిమయంబు నగుచు
భాసురలీల రూపగుణంబు లైన
యాసోమసూర్యబింబాంతరాళమునఁ
దళతళ వెలిఁగెడు తారకలోన
నెలవుగ నొనఁగూర్చి నిటలంబు చేర్చి
యొక్కింత భ్రూయుగం బొనరంగఁ బైకి
నిక్కించి నడిమింట నిల్చి చూచినను
అచట నాత్మప్రత్యయంబు లావేళ
ప్రచురంబు లై తోఁచు బహువిధంబులను
అవి చూచుచును మనం బట్టట్టు వోక
యవిరళప్రజ్ఞతో నచట నిల్చుచును
మన మట్లు నిల్చిన మారుతం బపుడు
పనివడి తాఁ బట్టువడియుండు నచట
పొసఁగ మారుతమనంబులు గూడి యున్న
నసదృశం బగుబుద్ధి కప్పు డేకాగ్ర
భావంబు కల్గు నాభావంబు సగుణ

భావంబు లెల్ల తప్పక చూచుచుండు
నాచూపు ప్రత్యయం బభ్యాససరణి
చూచుచుండఁగ నందు సుచిదంబు రాశి
యందు దృశ్యంబులు నడఁగి యున్నిటికిఁ
జెందినయెఱుక తా శేషించి యుండు
మొనసి ధ్యాతృ ధ్యాన ధ్యేయములు లేక యుండు
వినరాక యిమ్ముగ వెల్గుచు నుండు 110
నది యమనస్కాఖ్యమగు వరయోగ
మదియ దానికిఁ బరం బైనది లేదు
క్రమముగ సకలయోగవిధానములకు
రమణీయ మై తాన రా జగుచుండు
కావున రాజయోగం బనుపేర
పావనమై గోప్య భావ మై యుండు
మురువుమీరఁ ద్రికూటమునకుఁ బూర్వానఁ
బరికింప నొప్పును బావనానలము
దానిపై భూమ్యాది తత్త్వంబు లైదు
పూనిన వర్ణము ల్పొలుపొందు చుండు
నానిగ్గులో నుండు ననలమండలము
దానిలోపల నుండు తరణిమండలము
మఱి దానిలోఁ జంద్రమండల ముండు
నరుదుగ దానిలో నంకురం బొకటి
అదియు భవ్యాకార మై చెల్వుమీర

నది బీజ మై యుండు నఖిలంబులకును
అచటఁ బ్రవర్తించు నఖిలదృశ్యములు
ప్రచురంబుగాఁ బరాత్పరవస్తు వరయ
ఘనతరాపాంజ్యోతిగతిని రేపవలు
మొనసి యంతర్బాహ్యముల వెల్గుచుండు
నారయ సుపనిషదర్థసూచకము
వేఱు చిత్తము లేక విన దృఢంబుగను
అలరార నీలతోయదమధ్యమందు
వెలుఁగు విద్యుల్లేఖవిధమున మఱియు
సురుచిరనీవారశూకంబు పగిది
నరయ నీలచ్ఛాయ నలరుచు మఱియుఁ
జెలువంద పావకశిఖదానినడుమ
బలముగ వ్యాపించి పరమాత్మ యుండు
నిది బ్రహ్మ మిదె శివుం డిదియ విష్ణుండు
నదియ దేవేంద్రుండు నదియ యక్షరము
అదియుఁ బో పరమంబు నదియే స్వరాట్టు
నదియ సత్తామాత్ర మని యార్యజనులు
తెలుచుగ దైవభేదంబు లెన్నుదురు
పరతత్త్వమున భేదభావంబు లేదు
నామరూపంబు లెన్నఁగ వేఱులైన
హేమంబునకు భేద మెందైనఁ గలదె ?
ఆరీతి వెల్గు నాయాత్మఁ జూచుటకు

సారమై యుండుచు శాంభవిముద్ర
వలనొప్పు శుభయ గావలె నెట్టులనిన
నరుల పాడ్యమిదృష్టి యమవసదృష్టి 130
అల పౌర్ణవమిదృష్టి యనెడుసంజ్ఞలను
విలసిల్లుచును మూఁడు విధములై యుండు
పరగ నీమూఁటిలోపల తొలిరెంటిఁ
బరిహరింపుచు మహాప్రజ్ఞ దీపింప
నరవి మూఁడవచూపు సాధింపవలయు
నరయ నేర్పున లక్ష్య మనువెలదృష్టి
కలిగి రెప్పలపాటు కలగకుండినను
విలసితమగు శాంభవీముద్ర యగును
ఈముద్ర ధరియించి యేకాగ్రమతిని
యామధ్వయను చూడ నపుడుమానసము
కరువలి క్షీరోదకన్యాయ మగుచుఁ
బరువడిఁ గూడి లోపల నిల్చియుండు
నొనరంగ నందులో నొకటి చలించి
చన రెండవదియు నాసరణిదీపింప
నా రెంటి నొకచోట నమరంగఁ గూర్చి
సారంబు తనర నిశ్చలత వహించి
నిర్వికల్పసమాధి నిలచిన నదియ
సర్వంబు గనుఁగొను సత్పథం బరయ
రాజయోగంబు విరాజమానంబు

నైజమా సచ్చిదానందపదంబు 140
పాటించి బుద్ధి నీభావంబునందు
నాటించు మని పల్కు నందను జూచి
నాతండ్రి సచ్చిదానందలక్షణము
ఖ్యాతిగఁ దెల్పిన న్గరుణించు మనిన
జనని వీక్షించి విశ్వాసంబుతోడ
మునిరాజచంద్రుండు మొనసి యిట్లనియె
నలినాక్షి సచ్చిదానందప్రభావ
మెలమితో నిపుడు నీ కెఱిఁగింతు వినుము
లలి నొప్పుచున్న నీలజ్యోతిలోన
విలసిత చిద్బిందు వెలుఁగుచునుండు
సరసమై యచ్చట స్ఫటికతేజంబు
చిరమైన యాపరశివకళై యుండు
జనని యాశివకళ సత్తన నొప్పు
ననఘ చిద్బిందుచిత్తనఁగఁ బెంపొందు
నది రెండు గలయుట యానంద మగుచు
వివరంబుగాఁ దత్వవిదు లెఱుంగుదురు
ఒనరంగ నదియు నింకొకరీతిగాను
వినుము చెప్పెద దాని వేడ్క నోతల్లి
కనుఁగొన నీసర్వకామరూపములు
ననువుగ సచ్చిదానందంబు గలదు 150
ఈరూపనామంబు లెసలారుచున్న

నల యస్తిభాతిప్రియములు భావింప
సత్తులింగ మనంగ సహజమై యుండు
చిత్తన నంగంబు చెలువంబు మీరు
నీరెండు నొక్కటియే యై సదృశ్య
కారణమై విశ్వగర్భమై వెలుఁగు
నలఘునాదము లింగ మనఁగఁ బెంపొందు
నల బిందు వగుచును నమరు నా రెండు
ఘనత సాంఖ్యంబైన కళ యగునదియ
పెను పగునాదంబు బిందుకళయన
నీమూఁటి కాధార మేస్థాన మనిన
కోమల మైన త్రికూటస్థలమున
లలితమై యొప్పునీలచ్ఛాయవలెను
పొలుపొందునట్టి యోపోజ్యోతినడుమ
విలసితచిద్బిందు వెలుఁగుచు నుండు
నలర నాబిందులో నలఘునాదంబు
పలుకుచు నుండును బరమార్థ మైన
కలనాదబిందుసంకలితమై యుండు
అదె మూలప్రకృతియు నదె దేవహూతి
పదిలంబుగాను త్వంపద తత్పదములు 160
అసిపదభావ మింకలర తేటగను
పొసఁగఁ జెప్పెద విను బొంపిరివోవ
తనరంగఁ ద్వంపదార్థము జీవుఁ డనఁగ

విను తత్పదార్థంబు విమలచిదాత్మ
ఈరెంటి కైక్యంబ యొస నసిపదము
పారోక్తిగా నీవు సరణి భావింపు
మదె తత్వ మదె భావ మదె నిరాలంబ
మది సర్వసాక్షి నీ వదియ తలంప
నలరంగ నీచంద మనవరతంబు
తలఁపుచు నుండు నంతర్లక్ష్యమందు
వెలుపల లోపల వెలిని యానదుము
పొలుపొంద వెలుఁగు నాపోజ్యోతియందు
నిదుర జెందినరీతి నిల్చితివేని
యదియ యంతర్లక్ష్య మని చెప్పఁబడును
అది మహాకాశచిదాకాశ మనఁగఁ
బొదలు చిదంబరం బొనరంగ వినుము
తనరార నీనభాధారము చేసి
యొనరంగ నొకటితో నొక్కటిగూర్చి
యగణితం బైనచిదంబరస్థలిని
తగ నిల్ప నదియ యంతర్లక్ష్య మగుచు 170
జనని నీమనము నిశ్చల మైనదనుక
మొనసి యంతర్లక్ష్యముద్ర యేమరకు
మది యేమఱిన నిద్రరాదుల కైన
మది సంశయంబులు మానవు దల్ప
కావున నీవిప్డు క్రమము దప్పకయ

కైవల్యచిన్మాత్రకళయందు బుద్ధి
నాటించి సచ్చిదానందపదంబు
పాటించి నీవని భావింపుచుండు
తెలిసిన తెల్వియుం దెలియని మఱపు
తెలియ కానందాబ్ధిఁ దేలి యుండినది
బ్రహ్మసాక్షాత్కారపద మని తెలియు
బ్రహ్మానుభవ మందె పట్టుగ నిల్పు
మెఱుక నీ వనుచు నీ వెఱిఁగిన వెన్క
వఱల నీదేహంబు వాసన ల్మగుడ
కలిగిన నది బంధకము గాదు నీకు
వల నొప్పు సాదృశ్యవాక్యంబు వినుము
చెలువొంద ముత్యపుఁజిప్పలో వ్రాలి
సలిలంబు ముత్యమై సరవిఁ జిప్పఁగొగి
తొల్లిటివలె నీలతో యమై పోవు
తల్లి నీ వారీతి ధన్యత నొందు 180
నీయాత్మ నీవయై నిల్చిన వెన్క
మాయ నిన్నంటునే మాయ యేదనిన
నిన్నుఁ గానక తన్వు నీ వన భ్రమసి
యున్నాళ్లు పరమార్థ మెఱుగకయున్న
ఇదియపో మాయ యిం కెయ్యది గాదు
మది నెన్న నొకరూపు మాయకు లేదు
అదియ నిర్వచనీయ మదియనిగాదు

అది గల్గి లేనిది యదియయవిద్య
యదియెట్లు జనియించు నది యెట్టు లడఁగు
నది తేటపఱచు మనంగ నిట్లనియె
పరిశుద్ధమైన నభంబు వీక్షింప
పొరిది నీలచ్ఛాయ చూపట్టునటుల
నిర్మలమై వెల్గు నిర్గుణమందుఁ
గర్మంబు గర్మగఁ గల్గినమాయ
యొందెందుఁ జూచిన యేకమై పొంది
యుంది యంచును జూడ నుండును మాయ
యొందు లేదని చూడ నెటులేదు మాయ
యందునీలత్వమాకాశంబు నందు
నెటువలె దబ్బరో యెఱుకతోఁ జూడ
నటువలెనే దబ్బరై యుండు మాయ 190
యిదివరదాక ని న్నెనసినమాయ
మదితోడ నీమాయ మాయమై పోయె
మాయలోపల మాయ మహనీయమాయ
యీయఖండజ్ఞప్తి యెఱుఁగనిమాయ
యిటువంటిపరమార్థ మిద్ధాత్రిలోన
కుటిలచిత్తులకు సద్గురుదూషకులకు
నత్యంతవిషయేంద్రియాసక్తులకును
సత్య మూహింపని సంశయాత్ములకు
భీతాత్ములకు మిత్ర భేదవాదులకు

నీతిహీనాస్యులకును నిర్దయాత్ములకు
కామంబు గల యహంకారచిత్తులకుఁ
గామకర్మాసక్తి గల్గువారలకు
నుపదేశ మిచ్చిన నూరక లేని
విపరీతసంశయవితతులు చెలఁగు
గాన దృఢజ్ఞానకలితులు గారు
గాననీసద్విద్య గావలె నంచు
నడిగి నప్పుడనిశ్చితార్థుఁ డటంచు
నెడఁబాయకే విద్య యియ్యఁగ రాదు
ఈవిద్య కర్హుఁ డిం కెవఁ డంటివేని
పావనవైరాగ్యపద్ధతులైజేఁగి 200
తలఁగక మొదటి సాధనచతుష్టయము
చెలఁగ కభ్యాసంబు చేసినవాఁడు
శమదమాదులు గల్గి సద్గురుపాద
కమలంబులే గతి గా నమ్మువాఁడు
కనులముందఱ పరాంగన నిల్చియున్న
తను గన్నతల్లిగఁ దలఁచినవాఁడు
పరులవిత్తము లగుపడిన వీక్షించి
సరగునఁ దనకేలు చాఁచనివాఁడు
ఎక్కడి సంసార మెక్కడ గల్గు
నెక్కడ నడఁగు నే నెవ్వఁ డటంచుఁ
దనుదాన వెదకుచుం దనమనంబునను

పని బూని యీశ్వరార్పణముచేయుచును
విగతసంకల్పుఁడై విహితకర్మములు
తగ సల్పుచును భూతదయగలవాఁడు
సంతతంబును యదృచ్ఛాలాభమునకు
సంతసింపుచు సాధుజనులతో మైత్రి
శాంతవర్తనముచే సల్పెడువాఁడు
శాంతవేత్తల నొక్కసారి వంచించి
యది దెల్పు మిది దెల్పు మని త్వరపడక
సదమలుఁడై ధర్మ మనవరతంబు 210
కారణగురుమూర్తిఁ గన్గొన్నలోన
సారెకు మెలఁగుచు సామి యింకేమి
శరణంబు లేదు మీచరణద్వయంబ
శరణంబు నాకు నిశ్చయముగా ననుచుఁ
బదరి తా నడుగక భక్తి యేమరక
చెదఱక శుశ్రూష చేసెడువాఁడు
అవనిలో విద్యకు నర్హుఁడై యుండు
నవలసంశయములు నన్నియుం దీరు
నిటువంటిసద్విద్య నెఱుఁగ నేరకయ
మటుమాయచేఁ జిక్కి మదమత్తులైన
ఘోరాత్మకులు వారు గొఱ్ఱెలుగాక
వారి కెక్కడిది జీవన్ముక్తిసుఖము
అందందుఁ బాపతిర్యగ్జంతుతతుల

యందు జనింపుచు నడఁగుచు నుండు
పొలుపొందనటుకొంత పుణ్యావేషంబు
కలిగి యామనుజుఁడుగాఁ బుట్టి యపుడ
కనవచ్చు మోక్ష మేగతినైన నిపుడు
గనలేనివానికిఁ గల్గునే యవల
నిపు డిట్టి సుజ్ఞాన మెఱుఁగనివారు
చపలాత్ములై మఱి జన్మజన్మమున 220
పాపంబు చేసి తత్పారంబు లేని
కూపాన మఱి మునుంగుచుఁ దేలుచుందు
రిటువంటిసంసార మెసలారు చుండి
పటువిరక్తిని దోసి పరమాత్ముఁ డైన
కారణగురు చేరి కడతేరినట్టి
ధీరమానసుఁ డాదిదేవుఁ డై నిల్చి
పన్నుగఁ దనఘటప్రారబ్ధమునను
ఎన్ని దినంబు లిం కీధరయందు
విహరింపుచుండును విశ్వమంతయును
మహిమ మీఱ వినోదమాత్రుఁ డై చూచుఁ
దలఁపున విధినిషేధము లెంచఁబోఁడు
చెలఁగి తా నొకరిని సేవించఁబోఁడు
భేదవాదులతోడ బిట్టుగఁ దర్క
వాదము లాడఁడు వదలఁ డెప్పుడును
ఎందుఁ జూచినఁ గాని యెఱుఁగనివాని

చందంబుతోఁ గడు సాత్వికుఁ డగుచు
నతులప్రకాశుఁ డై యానంద మొందు
నతఁ డిల నవధూత యనిపించుకొనును
విలసితముగ బ్రహ్మవేత్తలక్షణము
తెలిపెద విను మింకఁ దెలియఁగునోతల్లి 230
గురుకటాక్షంబున గుఱియందు భ్రమసి
గురుతరసంసారగోష్ఠియందుండు
నమలుఁడై లౌకిక మనుసరించుకొని
యమరంగ శత్రుమిత్రాదుల బ్రహ్మ
భావంబుగాఁ గని పరమతత్త్వైక్య
భావుఁడై యెపుడు నిర్భరచిత్తుఁ డగుచు
వాసి నింద్రియముల వ్యాపారములను
జేసి యడంగును సిద్ధం బటంచు
పరమాత్ము తా నను భావ మేమఱక
యరుదుగ సంసారి యగు నొకవేళ
నుప్పొంగి యోగియై యుండు నొక్కతఱి
నెప్పు డెట్లుండుట నెఱుఁగంగరాదు
ఘనమైన రాజయోగప్రకారమునఁ
దనయభీష్టముగ స్వతంత్రుఁడై మఱలు
జల మంటనట్టియీ సరణి దీపించు
నలరు దేహంబున నబ్జపత్రమునఁ
దనరంగ జలమునఁ దా నంట దెపుడు

మనుజులు కొంద ఱా మహిమఁ గానకయు
సంసారియై మనచందంబు నుండి
హంసస్వరూప మె ట్లగును వీఁ డంచు 240
దూషించుచుందురు దొడరి యారీతి
దూషించువారికిఁ దొలఁగక యోగి
చేసినదుష్క్రియ ల్చేరు నాక్షణము
వాసిగఁ గొంద ఱా వరయోగియందు
నిలుకడగా భక్తి నిల్పి సంతతము
వెలయుఁ దద్గుణములు వినిపించు చున్న
వారికి నా యోగి వాంఛలు లేక
ధీరుఁడై చేసినదివ్యపుణ్యములు
చేరుచు నుండుఁ బ్రసిద్ధంబుగాను
సారె కీలోకానుసారంబుకొలఁకు
నిర్మలుఁడగు యోగినేర్పునం జేయు
కర్మముల్ రెండుభాగంబులై పోవు
నతనికి నీరెండు నంట దూహింప
నతఁడు నిర్విషయుఁడై యానంద మొందు
అల తొలియవధూత యా బ్రహ్మవేత్త
పొలుపొందుసమయము పొందుచుండునొగి
అతఁడు విరక్తుఁడై యడవిలో నున్న
నితఁడు సంసారియై యింటిలోనున్న
నెక్కువ తక్కువ లెన్నంగరాదు

తక్కక మోక్ష మిద్దరికిని సమము 250
పొలుపొంద నంచితపూర్వజన్మమున
బలముగఁ గేశవోపాసనచేసి
గురుతర మోక్షంబు కోరినకతన
పరువడి తా సుఖప్రారబ్ధగతిని
అరుదుగ సంసారి యై ముక్తి నొందెఁ
బరికించి చూడ నప్పరమావధూత
అల పూర్వజన్మంబునందు శంకరుని
చెలఁగి యుపాసనచేసి భావమునఁ
గ్రమమున మోక్షము కామించుకతన
రమణీయలీల విరక్తుఁడై నిల్చి
మోహపాశములను మొదలంటఁ గోసి
సాహసుఁడై ముక్తి సాధించుకొనియె
నిరువురకును మార్గ మేక మేగాని
ధరఁ దల్లి వినుము భేదము లేదు చూడ
మదిలోన నీ విట్టి మహిమ భావించి
మదికి రమ్యం బైనమార్గమం దుండి
గురుతరముగఁ బంచకోశంబులకును
బరమ నీ వై యున్న భావంబుగనుము
అన విని యాదేవి యాత్మజుఁ జూచి
విను మోక్షపర బ్రహ్మ వేదాంతవేద్య 260

## పంచకోశ ప్రకరణము

పంచకోశంబుల భావముల్ దెలియ
నంచితంబుగఁ దెల్పు మన నతం డనియె
విను మంబ యన్నంబు విఖ్యాతి బ్రహ్మ
మని శ్రుతియందలి యలరంగఁ బడియెఁ
గమలా ప్తవార్షి కకరములవలనిఁ
గమలంబు లుదయించె ఘనసస్యసమితి
నాయె నయ్యోషధు లన్నమై యొప్పె
నాయన్నరసము దేహం బయ్యె నిట్లు
అది యాత్మ యని కొంద ఱందు దృగ్దృశ్య
మది నశ్య మని నిగమాంతము ల్వాలుక
గాన దేహం బాత్మ గాదు భావింప
మానిని యీప్రాణమయ మాత్మ యంచు
పదరి కొందఱు మించి పల్కుచుండుదురు
విదితంబుగా దానివిధము భావింప
నది సూక్ష్మదేహాంగ మది యస్థిరంబు
నది యాత్మ యని చూడ నర్థంబు గాదు
అల మనోమయకోశ మాత్మ యటంచు
చెలరేగి కొందఱు చెప్పుచుండుదురు
అది సంశయాత్మకం బది యణుమాత్ర
మది చంచలము గల్గ నాత్మఁ గాఁబోదు 270
అలఘువిజ్ఞానమయ బ్రహ్మ మగుచుఁ

బలుమాఱు కొందఱు పల్కుచుండుదురు
దానికివృత్తి సంతతమును గల్గు
గాన నావృత్తి యఖండప్రవాహ
రూప మా నది యాత్మ రూపంబు గాదు
కాపట్యరహిత నిక్కంబుగ వినుము
ఆనందమయకోశ మట పంచకంబు
దానికి నభిమాని తనర మాయావి
పరగంగ సైంధవోపాధిచే నతఁడు
కర మొప్పజగములు గల్పించు నడఁచు
ధరశుద్ధసత్వప్రధాన మైనదియె
యిరవొంద మాయను నెసలారఁ దల్లి
మాయావి యరయ బ్రహ్మం బనుయుక్తి
పాయక కొందఱు పల్కుచుండుదురు
వనజాస్య యద్వైతవాదులమాట
కనుమతింపక మిథ్య యని తలంచుదురు
అతఁ డీశ్వరుండు విశ్వైకకారణుఁడు
అతులితమాయావి యైన దెట్లనినఁ
బూని చెప్పెద నది పొందుగఁ దెలియు
భూనభోతోయదముల జలబిందు 280
మొగి సదాంతర్బాహ్యముల ప్రతిఫలిత
మగుచున్న యిటువంటియాకాశ మటుల
అలఘుమహాబింబ మాత్ముఁడై తనరి

వల నొప్పగాను సర్వజ్ఞత్వముఖ్య
విలసితగుణగణాన్వితుఁ డై నకతన
నలినలోచన సగుణబ్రహ్మ యనఁగ
నటియింపు చుండు నానావిధంబులను
నటు గాన నిర్గుణ మని చెప్పరాదు
మఱి తల్లి విను మన్నమయకోశ మమరఁ
గర మర్థి నీస్థూలకాయమై యొప్పె
నవ్వలకోశత్రయంబు భావింప
నవ్వల సూక్ష్మాంగ మలరారు చూడ
అలఘుపంచమకోశ మయ్యెఁ గారణము
తలఁప మాయారూపు తను వయ్యె నట్లు
ఆమాయ నాత్మజ్ఞు లందు లే దండ్రు
వామాక్షి సంశయవారితంబుగను
పరఁగఁ జిత్తమును నభస్థలమైన
సురుచిరం బాశ్రయ శుద్ధవిజ్ఞాన
పటిమచే నైశ్వర్యభావంబు నొందు
నట భ్రాంతిచేఁ గల్గినటువంటిమాయ 290
సకలాశ్రయబ్రహ్మ సంవిత్తుచేత
నకలంకముగ నష్ట మౌక్షణంబునను
జననిబుద్ధాబుద్ధజను లిందుఁ గొంద
అనుమతింపక యుందు రాయుక్తి వినుము
అలరంగ రజితాని కలభిన్నధర్మ

ములు గల్గి యాభాసమును గల్గె నంచు
తొలినుండి భిన్నసత్తులు గావు విశ్వ
ములకుఁ బరబ్రహ్మ మనియెడువాఁడు
ధరణిస్థలిని వేదతత్త్వండుగాని
పరగ మూఢుం డట్లు భావింపఁ గలఁడె?
అటువలె నిశ్చయం బందె నీమనము
నిట్లైన విశ్వ మేదెసఁ దలంపంగ
మదిలోనఁ దన కనుమానంబు కొంత
కదిసి యున్నందున కల్గె నవ్వేళ
జనని యివ్వలపుచ్ఛ సద్బ్రహ్మ మనఁగ
ననఁ బొందఁ బంచకోశాతీత మయ్యె
నది యసత్యం బన్న నన్ృతంబు వెలయు
నదియ నీవును నేను నఖిలవిశ్వంబు
సచ్చిదానందాబ్ధి సంపూర్ణమగుచు
నెచ్చుక తగ్గక యేకమై యుండు 300
నది మనం బందెఁ దదన్యభావమున
విదితంబుగాఁ జూచి విశ్వంబు మఱువు
మది యెట్లనిన నీసమాధానమతిని
ముద మొప్ప వినుము నే మొనసి చెప్పెదను
పని బూని వామగుల్ఫమున నాధార
వనజంబు పీడించి వామేతరంబు
వామాంకతలమున వైపుగ నిడిన

యీమహానీయముక్తాసన మాయె
నియాఖ్యాసనంబున నేకచిత్తమున
నెయ్యంబుతో నిల్చి నిక్కించి నడుము
దృష్టి నాసాగ్రానఁ దిరముగ నుంచి
యష్టమదంబుల నడఁచి పిమ్మటను
ఘటపటాదులమాయగాఁ జూచి యచట
ఘటిత మైనది సత్తుగాఁ గనుంగొనుము
ఆసత్తు విస్ఫురణాకార మగుచు
భాసురచిత్తుగఁ బ్రబలుటఁ దెలిసి
రహిస్థూలసూక్ష్మకారణముల వెలుఁగు
సహజవస్తువు నేకసరణిగఁ గాంచి
అరయ ననేకోర్వి యండకోశములు
వరుస నావరణతత్త్వముల నన్నిటిని 310
హెచ్చుగ నోతల్లి యెలరార వినుము
సచ్చిదైక్యంబుగ సమరసింపుచును
అస్తిభాతులచేత నడఁచి వైచుచును
వస్తుమాత్రం బెల్ల నారూప మంచు
నారూప మెంచ స్వయంజ్యోతి యేక
మారూఢి సరణిచే నాత్మగాఁ గనిన
నాయాత్మ నాదిమధ్యాంతము ల్దొలఁగి
మాయావిరహితమై మదిభేద ముడుగు
నప్పుడు ఘనసచ్చిదానందపూర్ణ

మెప్పుగ నీవగుదుర్విలోకముల
కరపర్థి నపుడు జగద్వాసనముల
దొరఁకొని మనమందుఁ దోఁచినగాని
హస్తిభాతులచేత నాత్మగాఁ గనుచు
నిస్తరంగం బైన నీరధిపగిది
కలలేని నిద్దురగతిని భేదంబు
తొలఁగి సంపూర్ణమై తుర్యమా నంచు
నిర్వికల్పంబున నిశ్చలత్వమున
సర్వ మఖండమై సత్యమై నిత్య
శుద్ధబుద్ధవిముక్తి సొంపొంది పరమ
సిద్ధాంతసిద్ధమై చెలఁగుచునుండు 320
నోయమ్మ యచట నేనుండినయపుడ
నీయాత్మ నర్చించు నిశ్చయంబుగను
వలనొప్పఁ దెలియఁగ వలెనని యాత్మ
నలరార నర్పించు నట్టిచందంబు
క్రమముగఁ దెల్పె నుత్కంఠ దీపింప
నమలమానస యైన యాదేవహూతి
అలఘుత్వ మైనముక్తాసనమందు
నలువొందఁ గూర్చుండి నడుము నిక్కించి
మెడ దృఢంబుగ నిల్పి విహిరాబ్జరిపుల
నడరంతఁ గూర్చి నాసాగ్రంబు చేర్చి
అనుపమసద్బోధ యనువహిన్లోను

జనియంచినట్టి విజ్ఞానదీపంబు
కరమొప్ప మఱియను కరమునం బూని
చొరవఁగ హృద్వీథిఁ జొచ్చి శోధించి
అచ్చటినాళంబు లచ్చటిక్రమము
లచ్చటిచోద్యంబు లరసి చూచుచును
చెలువగు దేహపశ్చిమభాగమందు
నిలిచి వీణాదండ నిజమై తనర్చి
యొనర దీర్ఘాన్తియు నొఱపుగ నమరి
తనుతరంబై బిసతంతుచందమున 330
సురుచిరంబైన సుషుమ్నంబునంటి
కరమర్థితో నూర్ధ్వగమనంబుచేతఁ
జెన్నలరిన మేరుశిఖరిపైఁ జేరి
కన్నచోటున బయల్కలయ భావించి
నాలయ కప్పుడు వెలి చూపులోఁ జూపు
నలరారఁగాఁ జూచి యట రెండు విడచి
మహనీయతరమైన మధ్యలక్ష్యమున
సహజంబుగా నిల్పి సంతసమంది
నెలవుగ నాత్రివేణీసంగమమునఁ
జలన మొందక నిల్పి స్నానంబు చేసి
లాలితజ్ఞప్తి కళామాత్రమైన
లీలనొందెడి యాత్మలింగంబు గాంచి
అర్మిలి దీపింప నర్చింపఁ దలఁచి

వేర్మిగల్గిన చతుష్పీఠమందుంచి
అమలమహా తత్త్వమస్యాదివాక్యములు
క్రమముగ మంత్రములుగా స్మరింపుచును
ప్రణవం బనెడుఘంటపట్టి వాయించి
గణనము చేయక కామాదు లనెడు
ఘనవిఘ్నకారిరాక్షససమూహముల
మునుకొని బలుదూరమునఁ బారదోలి 340
కూర్మితోఁ బూర్ణ మాగురుని కర్పించి
కర్మనిర్మాల్యంబు కడపట ద్రోచి
అలమట శమదమం బనెడుతోయమున
నలరు నర్ఘ్యము పాద్య మాచమనంబు
నలువొప్ప నొసఁగి స్నానంబు చేయించి
బలమైన సమదృష్టిభావన యనెడు
పరిశుద్ధసాత్వికాంబరము ధరించి
యరుదుగ శక్తిత్రయము నొనఁగూర్చి
తనర యజ్ఞోపవీతంబుగ నిచ్చి
యనుపమసద్విద్య యనుగంధ మలఁది
తనభూతదయ నక్షతలుగ ధరించి
సునయగుణములను సుకృతవాసనలు
తనరు పుష్పములు సద్భక్తియనుపూజ
మనము రంజిల్ల సమ్మతముగఁజేసి
రమణీయమగు నంతరంగచతుష్ట

యము ధూపముగనిల్పి యఖిలేంద్రియాది
ప్రమదముపేర్మి దీపంబుగ నొసఁగి
యమరినజవతత్వమగు సుధారసము
మునుకొని నైవేద్యముగ సమర్పించి
తనరార నానందతాంబూలమిచ్చి 350
పరఁగాత్మప్రత్యయప్రభ సముజ్వలము
పరఁగ సువర్ణపుష్పంబుగనిచ్చి
పంచభూతములఁ బ్రపంచమంతయును
పంచార్తులుగ సమర్పణమొప్పఁజేసి
అట చిత్తవిశ్రాంతి యను ప్రదక్షిణము
పటుముదంబునఁజేసి బ్రహ్మైక్యమనెడి
ఘననమస్కార ముత్కంఠతోఁజేసి
తనలోనిపరమాత్మ దాఁ జూడఁగాను
చూపురూపుననంటి సోరిదిగనట్టి
చూపురూపైకమై సుస్థిరమైన
ఆత్మలింగము తానయై ప్రకాశించు
నాత్మానుభవమునం దలరుచుసొక్కి
మననంబు మఱచియు న్మనుజెందునపుడు
మొనయ జ్ఞాతృజ్ఞానములు జ్ఞేయమందు
గూఢమై యవివేకగూర్మి యంతయును
రూఢిగ సచ్చిత్సురూపమైనట్టి
నిర్వాణపదమందు నిండియేకముగ

నిర్వికల్పంబుననిద్దురఁజెంది
తాను నైకొంతతాఁ దడవుండిలేచి
మానినీమణి సత్కుమారునింగనియె 360
జయసర్వభూతాత్మ జయపరమాత్మ
జయచిన్మయాకార జయవేదసార
జయకలుషవిభంగ జయమహాలింగ
జయసత్యసంకల్ప జయనిర్వికల్ప
నీకటాక్షంబున నిర్గుణమంద
ప్రాకటంబుగ నైక్యభావమొందితిని
ఆయాత్మలోపల నఖిలవిశ్వంబు
మాయగనున్నది మైనీడమాడ్కి
నదిసత్యమన్న మహాద్వైతమందు
నుదితస్వదంతర మున్నదేతండ్రి
వ్యావహారికమాత్ర నంగీకరించి
వావిరిరెండని వచియింపవలసె

గురుతరంబుగఁబూజ గొనెడువాఁడెచట
చిరభక్తితోఁబూజ నేయువాఁడెవఁడు
సరవిఁబూజింపఁ బూజాద్రవ్యమేది
అరయఁగ వాఙ్మానసాతీతమగుచు
బొరిదిగ నిన్నుఁ బ్రస్తుతిచేయుటెట్లు
పురుడించుసర్వప్రపూర్ణమా నిన్నుఁ
జెలఁగి యావాహన చేయుటయెట్లు

తలఁప సర్వమున కాధారమౌనీకు 370
విహితాసనంబు గావించుటయెట్లు
మహితగుణంబును మఱియుండునీకుఁ
దనరార నర్ఘ్యపాద్యములిచ్చు టెట్లు
మొనసి సత్పరిశుద్ధముగ నుండునీకు
నలరార నాచమనాదుల యెట్లు
మలినంబులేక నిర్మలముగ నెప్డు
వెలుఁగుచుండెడు నీకు వేఱతోయమునఁ
జెలువుగ స్నానంబు సేయించుటెట్లు
కోమరొప్ప విశ్వావసుఁడవైన నీకు
నమరంగ నొకవస్త్రమర్పించుటెట్లు
మొనయఁగ గులగోత్రములు లేనినీకుఁ
దనర యజ్ఞోపవీతము లిచ్చుటెట్లు
పొలుపొంద నవయవంబులు లేనినీకు
వలనొప్ప భూషణావళిఁ దాల్చుటెట్లు
అనఘ నిర్లిప్తుఁడ వై యున్న నీకు
మును గుసుమార్చనంబును జేయుటెట్లు
సలలిత గుణనిరంజకుఁడవౌ నీకు
నెలమిగ ధూపంబు లిచ్చుటయెట్లు
వనజాప్తచంద్ర పావకులరూపముల
నొనరెడు దీపంబు నొసఁగుటయెట్లు 380
పొలుపార నిత్యతృప్తుఁడవైన నీకు

నలరఁగ నైవేద్య మర్పించుటెట్లు
మొనసి సదానందమునఁ జొక్కునీకుఁ
గొనకొని విడెము మక్కువనిచ్చు టెట్లు
మురువగు నాద్యంతములు లేనినీకుఁ
బరువడి మంత్రపుష్పము నిచ్చుటెట్లు
సునిశితస్వప్రకాశుఁడవైననీకు
నొనర నీరాజన మొసఁగుటయెట్లు
అనిశ మనంగుఁడ వౌనీకు భక్తి
మొనసి ప్రదక్షిణమును జేయుటెట్లు
వారక యద్వైత వస్తువౌనీకుఁ
జేరి ప్రణామంబు చేయుటయెట్లు
సారస్వతుల కగోచరమైననిన్ను
ధీరత్వముగ వినుతించుటయెట్లు
పొలుపొంద నిశ్చింతముగ నుండునదియె
నెలవుగ నిన్ను ధ్యానించు క్రమంబు
ఊరక నిష్క్రియ నుండుచందంబె
భూరిభక్తిని నిన్నుఁ బూజించువిధము
ఘననిశ్చలత్వంబు గల్గియుండినదె
యొనర ప్రదక్షిణం బొనరించుసరణి 390
నలరు సోహంభావ మందునిల్చినదె
చెలఁగి ప్రణామంబు సేయుభావంబు
మొనయ నాత్మజ్ఞానమున నేకనిష్ఠ

నొానరుసంకీర్తన మొనరించురీతి
పరిపూర్ణ భావసంపద గల్గినదియ
పరమైనమంత్ర జపంబు సేయుగతి
అలరార నెపుడు కృత్యాకృత్యములను
దెలియక మరచుట దివ్యశేమంబు
అంతియకాని మహాబ్రహ్మమందు
వింతగ భావంబు వేఱేమి లేదు
మఱియున్న దదియున్న మాడ్కిఁ గన్పట్టు
మఱిపోవ నదిపోవు మాయమాయగనె
అతులిత బ్రహ్మమం దాకలంకంబు
సతమౌనె చూడ వసంతకాలాన
నతులితంబుగనుండు నబ్జాప్తకరణి
వితతి ప్రకాశింప వింతగనందుఁ
బెదరెడి మఱుమరీచికచూచి జలము
కదలుచున్నది గ్రోలగావలెనంచు
భ్రాంతిచే మృగములు పరువెత్తుకొంచు
నెంతదూరముపోవ నెదురుగజలము 400
కదలిపోవుచునుండు కైవడిగాను
మదికి దృగ్వ్యాపారమహిమ లోఁదోఁచుఁ
గాని లేదనెడి నిక్కముదోఁచపోదు
గానఁ దద్భ్రాంతిచేఁ గడఁ గనలేక
సుడివడితిరిగించు సుడిగుంటరీతిఁ

గడఁగానరాని యఖండాత్మ కాంతి
అతిశయంబునఁదోఁచు నఖిలప్రపంచ
మతిసత్యమై యుండునట్లుండుగనుక
జనులీప్రపంచ మసత్యమటంచు
గనుకంటభావించి కడఁగానలేక
సతతంబు నీప్రపంచము నిత్యమంచు
నెంతకాలంబున్న నెదురుగజలము
గనుపించుచుండును గానియాలేమి
గనుపించ దీకర్మకాండంబు చూడఁ
గావున నీకర్మకాండచేఁ బుట్టి
పోవుచుందురు ముక్తి పొందంగలేక
ఘనతరసుజ్ఞానకాండను సత్తుఁ
గనినధన్యులకు మోక్షంబుసిద్ధించు
పరగరజ్జువుఫణిపగిది తోఁల్తఁదగి
యరసిచూచినవెన్క నదిలేనిమాడ్కిఁ 410
బరమాత్మయందీ ప్రపంచంబు మొదలు
తెలిఁగొప్పుచుండు నీతీరున నెపుడు
పావనసుజ్ఞానపటిమచే దాని
భావించిచూడఁగ భగ్నమైపోవు
ఇట్టిమిథ్యారూప మెసఁగువిశ్వంబు
పట్టుగ నిరతమీ బ్రహ్మంబునందు
నున్నదియనికొంద ఱానరభాషింతు

రున్న దిసత్త్వైన నున్న దేజగము
తాను దాననుదాని తలఁచినంతటను
నేను నేననువాఁడు నీరసంబయ్యె
నేనెవ్వఁడోయని నేనుభావించి
నేనుగా కటుమున్నె నేనుదానయ్యె
నేను తానైక్యమై నిలిచిచూడంగ
నేనుదాననరాని నేనునేనైతి
లలినెంచసలిలము లవణమైయుండి
సలిలంబులోఁబడి సలిలమాకరణి
నాబ్రహ్మమీజీవుఁ డనిపించి పిదప
నాబ్రహ్మమునుబొంది యదియుఁదానయ్యె
మొనసి పరబ్రహ్మమును నేనుగంటి
ననుమాటలేభ్రాంతి యదియెట్టులనినఁ 420
దనముఖంబెనఁడైన దర్పణమందుఁ
గనిదర్పణముదీసి కడనుంచినప్పు
ముసుదాను దర్పణమున జూచుచున్న
తనప్రతిబింబంబు తనలోనఁగలయు
నలరంగఁ బరమాత్ముఁ డాబుద్ధియందు
జెలువొంద బ్రతిఫలించినతన్వుదాను
కనుచున్నతఱిబుద్ధి గరిగిపోవగునె
తనప్రతిబింబమై తనమాడ్కినుండు
జీవుండు తనయందుఁ జెందుటకాని

జీవుండు తన్నుఁజూచిన నెందుఁగలదు
ముఖదర్పణంబులో మొనసిబింబంబు
ముఖము తాననిజూచి ముదమందుఁగాని
ముఖముకై వడి నద్దమునఁ గాన బడును
ముఖముసత్యంబైన ముఖము గన్గొనునె?
అలబుద్ధిచూపునా యభవుండటంచు
పలికినజడమది భావింపలేదు
గనులద్దమునుజూచుఁ గానియద్దంబు
కనులఁజూచుటలేదుగద పరికింప
నెలమినద్దము లేక యీక్షణయుగము
వెలయఁగఁ దనుదాను వీక్షింపఁగలదె? 430
కనుదోయిఁదనుదాను గనిసంతసింప
దనరనద్దంబు సాధనముగనుండు
నారీతిపరమాత్మఁ డాత్మప్రకాశ
మారూఢిఁగాఁ జూడ నమరుచు బుద్ధి
అలరారసాధన మైయుండుఁగాని
యలరుభావాతీత మైనబ్రహ్మమును
గనెడుసాధనమెందుఁ గలదెన్నటికిని
గనుచుండునదె సాక్షిగాసంతసంబు
పరిపూర్ణతరమగు బ్రహ్మైక్యమునకు
సరవిగనొకదిక్కు చను టేలయొలమి
అలరునవిద్యాదు లనెడునుపాధు

లలరార నశియించు నాక్షణమందె
యుండెడుచేతనే యుండుపూర్ణముగ
నుండెడు బ్రహ్మము దూరకేకలయు
సరవిమై నుండును సాదృశ్య మొకటి
వెలిపుగ నీకు నే విన్నవించెదను
ఘటము భిన్నంబైన ఘటపటాకాశ
మటగగనంబున మఱియుండుఁగలసి
ఆమఠం బడఁగిన నామఠాకాశ
మామఠాకాశము నందుండిగలయు
నారీతిగానట్టు లైనపిండాండ
కారణవిద్య దగ్ధంబయిపోవు
పొరిదిగాకుండిన చోటనయుండి
సరగున జీవుఁ డీశ్వరునిలోఁ గలయు
నారీతిగా దివ్యమగుశుభకాండ
కారణమగు మాయ క్రమమదె యుందె
కప్పురంబునుగాల్పఁ గడపటదాను
నుప్పరంబున పోవుచుండినరీతి
అలవిద్య తుదకు మహాబ్రహ్మమంది
వెలిఁగిలయంబొంది వేఱతాలేక
గానగు నావిద్య గల్గినయపుడ
పూని ప్రపంచబుద్ధ్యుద మొండు లేదు
అంతట యిది మిథ్య యనరాని రొటుక

వింత యొక్కటి లేక వెల్గుచునుండు
నటువంటి బ్రహ్మమేనైతి కలంక
మెట్టులైనజనియింప దిది నిశ్చయంబు
బట్టబైటను మోక్షపద మిట్లు దనరు
నెట్టులఁ గనుగొందు శ్రీబ్రహ్మవిద్య
అప్పు డాకపిలాఖ్యుఁ డాదేవహూతి
నొప్పుగఁ గన్గొని యొగి నిట్టు లనియె
జననిరో బహుజన్మసంస్కారమహిమ
ఘనతరమైయుండె గనుక శీఘ్రముగ
పరమనిర్గుణపరబ్రహ్మైక్యభావ
మరుదుగఁ బొందితి వంతియ చాల
నందఱ కిది లభ్యమైన ప్రపంచ
మెందుండు నటమీఁద నెసలార తల్లి
అనువుగ నెపుడున్న యదిలేని దంచు
నెనకలరీతి లేనిది యున్నదంచు
బలముగ భావించు ప్రాకృతజనము
వలన విశ్వం బట్లు వర్తింపుచుండు
నొనరంగ వారు లేకుండినమాయ
కునికి యెక్కడ లేక యూరకపోవు
దానికి యుక్త మాత్మజ్ఞానవిద్య
గాన తద్విద్య నిక్కము గుప్త మగుచు
వరపతివ్రతరీతి వర్తింపుచుండు

కల మొప్పుచుం గర్మ కాండాదు లెల్ల
సామాన్యగణికాళిసరణి నటించు
కామయుక్తులకు భోగముల నొసంగు
ఆభోగముల రోసి నటువంటిఘనుల
చే భగ్న మగుదాని చిత్ర మంతయును
అటమీఁదఁ దానాత్మ ననెడునిశ్చయము
డిటవుగఁ గల్గుసందేహంబు తలఁగు
నంతట పరిపూర్ణమై తాను వెల్గు
నింతంత కీకర్మ మెఱుఁగంగరాదు
సులభంబుగల్గు నీ సుజ్ఞానవిద్య
సులభ కాఠిన్యవిస్ఫురణ మెట్లనిన
నేను నేనని పండి నిండినదెఱుక
నేననిసులభమా నెఱఁగహంకృతిని
నేననఁ గఠినమా నిశ్చయమందుఁ
గాన నీబంధమోక్షంబులు రెండు
వలనొప్పఁగలవని వచియింపవలసె
నలకంటఁ గని నిశ్చయంబు భావించి
ఆబంధమోక్షంబు లభ్రముల్గాని
యాబంధమోక్షంబు లాత్మ కెక్కడిది
నిత్యముక్తుం డాత్మ నిర్గుణుండనెడి
సత్య మూహించిన సంకల్ప మేది
ప్రాకటముగ నిట్టి భావనిశ్చయము

నీకు లభ్యంబయ్యె నెఱిఁగన్నతల్లి
ఇరువుగ మఱియు నింకేన్ని చెప్పినను
నిరుపమానందమౌ నిశ్చల మొకటి
పరగ నీనిశ్చయభావంబుచేత
నరయక పరమాత్మ నంచు భావించు
భానుప్రకాశ మంబరమెల్ల నిండి
పూనియుండియును సద్భూరికాంతియొగి
స్ఫుటముగఁ గనరాక భూవృక్షశైల
ఘటపటాద్యాకారఘనమౌ వెలుంగు
నరణిఁ బరాత్ముఁ డాసనముననుండి
కరణాదులందుం బ్రకాశించుచుండు
సంతతం బీరహస్యము భావమందుఁ
జింతింపుచుండు సుస్థిరముగ జనని
ఇలభానుఁ డస్తాద్రి కేఁగినవేళ
కళలచే వెల్గుఁ దక్కక జాలమెల్ల
అమర నాతనియందు ననువొందుమాడ్కి
నమనస్కమున నడఁగౌ విశ్వమెల్ల
గనుక యీయమనస్క ఘనతరాభ్యాస
మున నీవు పరిపూర్ణముగ నిండియుండు
మానసమున వేంకమాంబికరచిత
మైననట్టి రాజయోగామృతసార

మిందెన్నఁగాఁ దృతీయప్రకరణము
పొందుగఁ దఱికుండపురిధాముఁ డైన
వీరనృసింహుఁడు వెలయఁ గైకొనియె
ధారుణి నాచంద్రతారార్కముగను.

రాజయోగసారము తృతీయప్రకరణము
సంపూర్ణము

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1950

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అడవిమల్లెలు | ... | 0 | 8 |
| అధ్యాత్మరామాయణము | ... | 2 | 0 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము | ... | 2 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 6 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము:— | | | |
| ఆది సభాపర్వములు ,, | ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము ,, | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు ,, | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు ,, | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు,, | ... | 4 | 0 |
| శాంతిపర్వము ,, | ... | 4 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు | ... | 1 | 8 |
| ,, టీక | ... | 4 | 0 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది 3 సంపుటములు | ... | 15 | 0 |
| డిటో 7 ,, | ... | 18 | 0 |
| ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారిది | | 0 | 12 |

| | | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|---|
| ఆంధ్రభాగవతము పద్యకావ్యము, 2 సంపుటములు | | 15 | 0 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| ఆంధ్రనామసంగ్రహము, పద్యకావ్యము | ... | 0 | 3 |
| ,, టీకతో (బ్రౌను పేపరు) | ... | 0 | 8 |
| ,, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు.టీకతో | | 2 | 0 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రభాషార్ణవము | ... | 1 | 0 |
| ఉత్తరరామాయణము, చక్కనికూర్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 3 | 0 |
| కవిత్వతత్త్వవిచారవిమర్శనము | ... | 1 | 8 |
| కవిరాజమనోరంజనము | ... | 1 | 4 |
| కృష్ణదండకము | ... | 0 | 2 |
| కృష్ణరాయవిజయము | ... | 0 | 8 |
| కాశీఖండము | ... | 3 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | ... | 0 | 6 |
| డిటో గట్టుప్రభుకృతము | ... | 0 | 10 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము | ... | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక | ... | 0 | 10 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది | ... | 0 | 12 |
| డిటో ద్విపద, నాదిండ్ల గోపమంత్రి | | 0 | 8 |
| గద్యపద్యసంగ్రహము, జ. వే. సుబ్రహ్మణ్యశర్మ గారిది. | | 0 | 12 |
| ,, గొర్తి సూర్యనారాయణశాస్త్రి గారిది | | 0 | 12 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దచ్చు | ... | 0 | 4 |
| గీతమంజరి, చిలకమర్తి లక్ష్మీనరసింహము | ... | 0 | 4 |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము | ... | 2 | 8 |
| చిత్రభారతము, చరిగొండ ధర్మనగారిది | ... | 1 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| చెన్నపురీవిలాసము | ... | 0 | 8 |
| చెన్నబసవపురాణము | ... | 2 | 8 |
| జైమినీభారతము | ... | 2 | 8 |
| తెనుఁగుసమస్యలు | ... | 0 | 3 |
| దసరాపద్యములు | ... | 0 | 2 |
| దశావతారచరిత్ర | ... | 3 | 0 |
| దేశింగురాజుకథ (జంగంకథ) | ... | 0 | 8 |
| ధ్రువోపాఖ్యానము, సటీక | ... | 0 | 10 |
| నలోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| నిర్వచనోత్తరరామాయణము | ... | 1 | 8 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు | ... | 2 | 4 |
| నిరంకుశోపాఖ్యానము | ... | 0 | 8 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము | ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము | ... | 0 | 8 |
| పల్నాటివీరచరిత్రము | ... | 3 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 2 | 0 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | ... | 1 | 0 |
| డిటో కాలికోబైండు | ... | 2 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 1 | 12 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు | ... | 1 | 8 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము | ... | 3 | 0 |
| భాస్కరరామాయణము | ... | 8 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| భోజకాళిదాసకథలు, I భాగము | ... | 1 | 0 |
| డిటో II భాగము | ... | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 6 |
| డిటో A. S. P. అయ్యరుగారిది | ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు 1. 2 - భా. | ... | 2 | 0 |
| రాజశేఖరుఁడు—గోపాలుఁడు | ... | 0 | 12 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 12 |
| చార్ దర్వేషుకథలు | ... | 1 | 0 |
| బేతాళునికథలు | ... | 0 | 12 |
| వైద్యులకథలు | ... | 0 | 4 |
| వీరాంగనలు | ... | 1 | 8 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 4 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 6 |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 8 |
| రేచుక్క-పగటిచుక్క-కథ | ... | 0 | 4 |
| సత్యసేనవిజయము | ... | 0 | 6 |
| ఋషులచరిత్ర | ... | 0 | 8 |
| పురాణగాథలు I | ... | 1 | 0 |
| ,, II | ... | 1 | 0 |
| బాజీరాయనిచరిత్ర | ... | 1 | 4 |
| రఘువంశకథ | ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, భా. రామి. శాస్త్రి | ... | 1 | 8 |
| ఈసబునీతికథలు 2-వ భాగము | ... | 0 | 10 |
| పంజాబుఅల్లరి | ... | 0 | 8 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 3 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 2 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర | | 1 | 0 |
| శకుంతల ,, | ... | 0 | 8 |
| నల ,, | ... | 0 | 8 |
| సావిత్రి ,, | ... | 0 | 6 |
| హరిశ్చంద్ర ,, | ... | 0 | 8 |

## నవలలు

| | | | |
|---|---|---|---|
| సీతారామము | ... | 1 | 4 |
| ఐవన్హో, నవల | ... | 0 | 8 |
| సుజనరంజని ,, | ... | 1 | 0 |
| విజ్జలదేవి ,, | ... | 1 | 8 |
| ఉన్మాదిని ,, | ... | 0 | 6 |
| రాధారాణి ,, | ... | 0 | 6 |
| దుర్గేశనందని ,, | ... | 1 | 0 |
| లక్షణ ,, | ... | 0 | 12 |
| లీల ,, | ... | 0 | 6 |
| కోవలన్ కన్నకి ,, | ... | 0 | 12 |
| వీరబాల ,, | ... | 0 | 8 |
| ఆనందమఠ ,, | ... | 1 | 12 |
| లాలాబాయి ,, | ... | 0 | 12 |
| రోషినార, చరిత్రవిషయికమగు నవల | ... | 1 | 0 |
| బాలాదిత్య (చరిత్రాత్మకమగు నవల) | ... | 4 | 0 |
| శంభుతో నొకనాటిసహవాసము | ... | 0 | 4 |
| చంద్రగుప్తుడు | ... | 2 | 8 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.